శ్రీరస్తు.

శ్రీ గురుభ్యో నమః

# శ్రీకృష్ణార్జునీయము.

వ్రాసినది

[illegible]



శ్రీ వెంకటేశ్వర ముద్రాక్షరశాల, కడప.

1947.

# విన్నపము.



ఆంధ్రవిద్యార్థులారా! ప్రియమైన సోదరులారా! ఇప్పటికి దాదాపు నూటయిరువదియేండ్లకు మునుపు ఎరోపాఖండమున బ్రిటీషువారికిని ఫ్రెంచివారికిని ట్రఫాల్గర్ దగ్గఱ గొప్ప నౌకాయుద్ధము జరిగెను. ఆయుద్ధము ప్రారంభించు సమయమునందు బ్రిటీషుసేనాధిపతియగు నెల్సన్ అను వీరాగ్రేసరుఁడు "England expects every one to do his Duty" అనగా "ప్రతిమనుజుఁడును తన నియతధర్మమును నెరవేర్చునని ఇంగ్లాండు దేశము నిరీక్షించుచున్నది" అను హెచ్చరికను స్వకీయ సైన్యమందు వ్యాపింపఁజేసి పిదప యుద్ధమును మొదలు పెట్టుటకు నానతియిచ్చెనని ఆంగ్లేయ చరిత్రములందు గొప్పగ వర్ణింపఁబడియుండుట మనముచదివియున్నాము. ఇట్టి హెచ్చరికకే స్వధర్మాచరణ విధియని మనశాస్త్రములందుఁ జెప్పఁబడును. ఈవిధినే భారతీయుల భాగ్యవశమున భరతఖండమునందు నైదువేల సంవత్సరములకుఁబూర్వమే ద్వాపరయుగాంతమునందు సంభవించిన భారతయుద్ధ సందర్భమునఁ గురుక్షేత్రమను రణరంగమందు అర్జునుని నిమిత్తముగాఁజేసికొని లోకులకందఱికి సాక్షాద్భగవంతుని పూర్ణావతారంబగు శ్రీకృష్ణుఁడు

నేఁడుగ నూటిపోసియున్నాఁడు. స్వధర్మాచరణ మైభవ మింతయని పొగడ నలవికాదు. కృష్ణపరమాత్ముని యుపదేశమందు విశేషాంశములు రెండు గలవు. స్వధర్మమును అనఁగా తనకు విధింపఁబడిన కర్మమును ఆచరించుటయందు ఫలము నపేక్షింపక యుండవలయుననుటయు, నట్టి ఆచరణమే ఈశ్వరారాధనమనియు నీశ్వర ముఖోల్లాసమునకు హేతువనియు నిరూపింపఁబడియున్నది. ఈమూఁడు అంశములు చేసిన కర్మమును జేయుట కర్మయోగమని వేదాంతశాస్త్ర పరిభాష. ఇట్లు ఇహపరంబులకు రెంటికి సహాయభూతమగా మహోత్కృష్టంబగు నుపదేశము ప్రపంచమునందు నింకొక వాఙ్మయమునందు లభింపదనుట అతిశయోక్తి కానేరదు. ఈవిషయమును బోధించియుండు గ్రంథమునకు భగవద్గీతయని పేరు. ఇది సంస్కృతమహాభారతమున భీష్మపర్వమునందున్నది. భగవద్గీతయని వినఁగానే మీకొకసందేహము కలుగ వచ్చును. లోకవ్యవహారంబున బలముడిగి ముసలివాఁడై నప్పుడెగదా పారాయణచేయుటకు భగవద్గీత కావలయును; బాల్యమందున్న మాతోడ దీనినిగుఱించి ముచ్చటించుట ఏల? అని అడుగవచ్చును. లోకమాన్యులగు బాలగంగాధరతిలకగారు భగవద్గీతయొక్క ముఖ్యోద్దేశము కర్మయోగ ప్రతిపాదనమేయని అభిప్రాయపడియున్నారు. అత్యంతకార్య సంభ్రమముమధ్యను నిండు జవ్వనమున

నున్న అర్జునునికి బోధించిన కర్మయోగము. శరీరదార్ఢ్యము నశించి యేకర్మము చేయుటకు వీలులేని వార్థక్యమున మునింగియుండు ముదుసళ్లకు నేలాటి యుపయోగము నగుపచ్చును ? విద్యాభ్యాసము ముగించుకొని గృహస్థుడై ప్రపంచవ్యవహారములం బ్రవేశించుటకుం బూర్వమే కదా కర్మయోగ రహస్యము నెఱింగియుండినం గార్యకారియగును. కావున విద్యార్థిదశయందే భగవద్గీతాపఠనము త్యావశ్యకమనుట స్పష్టమగును. ఇట్టి సర్వోత్కృష్టమైన గ్రంథపఠనమందు విద్యార్థుల కభిరుచి పుట్టుటకై అందలి సారాంశమును సంగ్రహించి ముఖ్యములైన కొన్నిభావములను బొందుపఱచి యీచిన్న పుస్తకము వ్రాయంబడినది. మఱియు వారి కోత్సాహముం గలుగను మఱికొన్ని వేడుక సందర్భములయందును, విద్యార్థులు నాటకములను బ్రదర్శించుట సంప్రదాయమైయున్నది. అట్టివేళల సారంగధర చిత్రాంగీ సంభాషణములగు నశ్లీలనాటకభాగములను ప్రక్కవేయించి స్వచ్ఛమా వెన్నవంటి మెత్తని బాలుర చిత్తములందుఁ బాపవాసనలు నాటుటకంటె వయస్సువచ్చుకొలఁది పురోన్నతికిఁ గారణమై శుభసంస్కారములను బెంచు గీతామృతమును గ్రోలుట శ్రేయస్కరంబని తలంచి నాటకరూపంబునం గూర్పంబడినది. ఈప్రయత్నము సార్థకమైనది లేనిది విద్యార్థుల చేతిలోనిది.

అన్యాశ్మ విద్యార్థి.

శ్రీరస్తు.

# శ్రీకృష్ణార్జునీయము.



## నాంది.

శా॥ ధర్మక్షేత్రమునంతరంగమున శుద్ధాశుద్ధసంస్కారముల్
కర్మప్రేరితయుద్ధముం జలుప భక్తశ్రేణి కజ్ఞానముం
నిర్మూలంబుగఁ జేసి నాకమొసఁగన్ నిత్యంబు హృత్సంస్థితున్
ధర్మస్థాపనశీలుఁ గృష్ణపరమాత్మజ్యోతి ధ్యానించెదన్ ॥

## ప్రథమరంగము.

### కురుక్షేత్ర యుద్ధభూమి—ఒక పార్శ్వము.

### ప్రవేశము—దుర్యోధన ద్రోణాచార్యులు.

దుర్యోధనుఁడు—ఆచార్యవర్యా! అదిగో చూడుము. తమ శిష్యుఁడు ద్రుపద పుత్రుఁడు పాండవసైన్యమును వ్యూహముగా నెట్లు పన్నియున్నాఁడో; వారికిసహాయముగ భీమార్జునులతో సాటివచ్చు యుయుధానుఁడు, విరటుఁడు, ద్రుపదుఁడు, దృష్టకేతువు, చేకితానుఁడు, కాశీరాజు, పురజిత్తు, కుంతిభోజుఁడు శైబ్యుఁడు, యుధామన్యుఁడు, విక్రాంతుఁడు, అభిమన్యుఁడు, ద్రౌపదేయులు, వీరందఱు మహార

ధులు చేసియున్నాడు. మన ప్రక్కన వచ్చియుండు
సేనానాయకులను సైతము తమజ్ఞాపకార్థము పే
ర్కొనెద నాలకింపుము. తమతో పాటు భీష్మ
చార్యులు, కర్ణుడు, కృపుడు, అశ్వత్థామ, వికర
ర్ణుడు, సౌమదత్తి, జయద్రథుడు- ఇంకెందరో యనే
కశూరులు-నానాశస్త్రకుశలులు-యుద్ధవిశారదులు
నాకొరకై రణరంగమున ప్రాణములు విడువ
సిద్ధముగానున్నారు- అయినను గురుదేవా! భీ
మునిచేత రక్షింపఁబడిన పాండవసేనకు, భీష్ముని
చేతఁ బాలింపఁబడు మనసేన తీసిపోవునాయని
సంశయించుచున్నాను. కావున మన వారలంద
రు వారివారి నియతస్థానములను వదలక వృద్ధు
డగు భీష్ములవారిని జక్కఁగఁ గాపాడవలయును.

ద్రోణుఁడు—రాజా! నీకట్టి సందేహమువలదు. నీపితా
మహుని పరాక్రమము నీకెఱుంగని వాఁడవే;
అహాహో శూరుఁడు బిగ్గరగా సింహనాదముచేసి
శంఖము పూరించుచున్నాఁడు వినుము. యుద్ధ
ము ప్రారంభమగుచున్నది. మనముపోయి కలిసి
కొందము రమ్ము. (నిష్క్రమించిరి)

(అశ్వారోహుఁడగు రాజు తొందరగఁ
ప్రవేశించుచున్నాడు.)

రాజు—అహో! ఏమి యీతూర్యములధ్వని? (ఆలకించి) తెలిసినది, తెలిసినది. కౌరవులు రణభేరీలు వాయించడమా! కుతికిగే కుక్క కలవదందురు. మాప్రభువుల శంఖనాదములుకూడ యిప్పుడే వినంబడుచున్నవి. అదిగో భీమకర్ముండగు వృకోదరుని పౌండ్రధ్వని—ఇదియే యుధిష్ఠిరుని అనంతవిజయనిస్వనంబు—సుఘోషమణిపుష్పకశబ్దంబులు నకులసహదేవులవి సుమా - మొట్టమొదటనే మాశ్రీకృష్ణార్జునుల పాంచజన్య దేవదత్తముల నడు దివ్యశంఖారావంబులు శ్రవణంబులకు విందొనర్చెను. మా సేనయందలి మహారథులచే బూరింపబడిన శంఖధ్వనులు అప్పుడే ధార్తరాష్ట్రుల గుండెలు పగులునట్లు చేయుచున్నవి. ఈవైపున శ్వేతాశ్వములు కట్టిన మహత్తైన రథమునందు కృష్ణార్జునులు వచ్చుచున్నారు. నేను ముందుగనే మా సేనానాయకుని యాజ్ఞకు నెదురు చూడ వలయును. (అని గెట్టుగా పోవుచున్నాడు)

[రథముపైని కృష్ణార్జునుల ప్రవేశము]

అర్జునుడు—(ధనువుపైకెత్తి) కృష్ణా! దుర్బుద్ధిగల దుర్యోధనునికి యుద్ధమున సహాయము చేయుటకై వచ్చినవీరులలో నెవ్వరితో నెదిరించి నేను

నేరుగఁ బోరుటకు యోగ్యులో వారినందఱిని నే
కనులారఁ జూచుటకు నుభయసేనల నడుమ
మన రథంబును నిలుపుము.

కృష్ణుఁడు—(రథమును గొంతదూరము తోలి) సవ్యసాచి!
యుద్ధమునఁ జేరియున్న కౌరవాదులను లెస్స
గఁ జూడుము.

అర్జునుఁడు—(నలుదిక్కులఁ బరికించి వ్యసనముతో)

తే.గీ. యుద్ధసన్నాహమునఁ గూడియున్న బంధు
జనులఁగని నాదుగాత్రముల్ సడలె; మోము
వాడుచున్నది, దేహకంపంబుఁగల్గెఁ;
వగ గగుర్పాటుపుట్టె, హస్తంబునుండి
జాఱుచున్నది గాండీవచాప, మొదలి
చర్మమును మండు, నిలువంగ శక్తిలేదు,
చిత్తమొప్పదు భ్రాంతిని జెందినట్లు
చాలఁ దోచెడి విపరీత శకునములును;
సంగరంబున స్వజనముఁ జంపి పిదప
శుభముగలదని తలఁప నించుకయుఁ గాన
జయముఁ గాంక్షింపనొల్ల రాజ్యంబువలదు
సౌఖ్యమును గోరనట్టి రాజ్యంబువలన
నేమి ఫలము? భోగంబుల నేమిఫలము?
జీవితంబున ఫలమేమి? చెపుము కృష్ణ!

మనము రాజ్యము భోగముల్ మఱియు సుఖము
లెవరి కొఱకయి కోరంగ నెంతుమట్టి
గురువులును, దండ్రితాతలు, కొడుకులింక,
మనుమలును, మామలును, మేనమామలట్లె
మఱియు వియ్యంకులను, బావమఱదు లదిగొ
అసువులందును ధనమందు నాసవదలి
కలని కేతెంచియున్నారు గనుము కృష్ణ !
కదనమున నన్నుఁ జంపినఁగాని వీరిఁ
జంపనొల్లఁ ద్రైలోక్య రాజ్యమునకైనఁ
జెప్పవలయునె భూమినార్జించుకొఱకు ?
ధార్తరాష్ట్రులఁ జంపి యుద్ధరణి నేమి
ప్రీతి చేకూఱు మనకు ? వీరాతతాయు
లైనఁ గానిమ్ము మఱి వీరి హత్యవలన
మనకుఁ బాపంబె యగు జనార్దన ! తలంపఁ
గనుక మనకింక బంధువర్గంబుతోడ
ధార్తరాష్ట్రులఁ జంపంగఁ దగదు కృష్ణ !
స్వజనములను జంపి మనకెట్లు సౌఖ్యమబ్బు ?

కృష్ణా! రాజ్యలోభంబుచేత వ్యామోహంబుఁ జెందిన చిత్తములు గలవారగుటంజేసి కులక్షయదోషమునుఁగాని మిత్రద్రోహపాతకమునుఁగాని కౌరవులు తెలియజాలకున్నారు. అన్నియు నెఱింగిన

మనకిల యిట్టి దుష్కార్యమునుండి మరలఁగూడ
దు ! వినుము.

సీ॥ సంపూర్ణముగఁ గులక్షయముచే బహుసనా
తనకులధర్మముల్ ధరనశించు
ధర్మ నష్టమున నధర్మము తలయెత్తి
కులమెల్ల వ్యాపించుఁ గులముచెడినఁ
గులకాంతలంత దుర్గుణముల పాలౌట
వర్ణసంకరమౌను వాసుదేవ!
కులఘాతకులు భ్రష్టశీలజాలు వర్ణసం
కరముచేఁ బడుదురు నరకమందు।

తే॥ గీ॥ లుప్తపిండోదకక్రియల్ వ్యాప్తిఁ జెంది
వారి పితృదేవతలుకూడ పతితులగుట
జాతికులధర్మములు వినాశంబుచేయు
పాపులకుఁగల్గు నరకనివాసమెపుడు।

కటకటా! రాజ్యసుఖ మపేక్షించి స్వజనహింసకు యుత్నించితిమి. గొప్పపాపంబు నొడికట్టుకొన సాహసించితిమి. నిరాయుధుడనై ప్రతీకారము సేయఁదలపెట్టని నన్ను శస్త్రపాణులగు దుర్యోధనాదులు రణరంగమునఁ జంపినను అట్టి మరణము నాకు క్షేమతరము యగును. కాన నేను యుద్ధముఁ జేయఁజాలను.

(అనిచాపంబును గ్రిందవైచి రథంబుపైనీడి
గిలఁబడెను).

## ద్వితీయ రంగము.

యుద్ధభూమి—రథముదిగి కృష్ణార్జునుల ప్రవేశము.

కృష్ణుఁడు—అర్జునా! ఏల యిట్లు కన్నుల నీరు పెట్టుకొను చున్నావు! ఆర్యులకుఁ దగనట్టియు, స్వర్గమునకు దూరమైనట్టియు, నపయశస్సునకుఁ గారణంబైనట్టియు, నిట్టినవ్యాకులంబు నీకేలయీసందర్భము గ నావిర్భవించెను! క్లైబ్యమును బొందకుము. క్షుద్రమగు హృదయ దౌర్బల్యమును వదలిలెమ్ము.

అర్జునుఁడు—అరిసూదన! పుష్పముల చేతఁ బూజింపఁబడఁదగిన భీష్మద్రోణులను బాణముల చేత నెట్టులెదిరింతును? మహాత్ములగు నాచార్యులను జంపుట మాని భిక్షాన్నమైనను మేలు; గురువర్యులఁజంపిన యెడల వారిరక్తముచేఁ బూయఁబడిన కామభోగములఁ ననుభవించెడు వాఁడనగుదును. ఎవ్వరిఁజంపిన పిదప బ్రతికియుండవలయుననుకోరిక మనకు గలుగుదో యట్టి కౌరవేయులు యెదుటనే యున్నారు. మఱియు నింకొక సందేహము. మనమే జయింతుమో లేక వారేజయింతురో ఇట్టి సందర్భమున భిక్షాన్నరక్తాన్నముల రెంటిలో నేది శ్లాఘ్యమగును? కార్పణ్యదోషము చేత నాకు

తే॥ గీ॥ జీవునకు నిట్లు కౌమారయౌవనములు
ముసలితనమొగి నీదేహమున నెగలుగు
గతిని దేహాంతరప్రాప్తి కలుగునట్టి
మోహమెయ్యెడ ధీరుఁడు పొందఁడెపుడు.

మఱియు శీతోష్ణములు సుఖదుఃఖములు ఇవి యన్నియు నింద్రియములకును శబ్దాదివిషయములకును గలుగు సంబంధమువలనఁ బుట్టుచున్నవి. అవి నిత్యములుకావు, వచ్చుచును పోవుచునుండును. కావున వానిని సహించుకొని యుండుము.

అర్జునుఁడు—అట్లు శ్రమపడి శీతోష్ణాదులను సహించుకొని యుండుటవలన లాభ మేమి?

కృష్ణుఁడు—చెప్పెదను వినుము, విషయవాసన లొక్కింతయు బాధింపని సుఖదుఃఖసముఁడగు ధీరుఁడైన పురుషుఁడే మోక్షసామ్రాజ్యమునకు నర్హుఁడగును. మఱియుఁ బారమార్థికమగు సంగతి నొక్కటిఁ దెలిసికొనుము.

తే॥ గీ॥ సత్తునకులేదభావ మసత్తునకును
లేదుభావము రెంటికి భేదమిట్లు
తత్త్వదర్శులచేత యథార్థముగను
దెలిసికొనఁబడెనన్ని కాలములను.

కావున శోకమోహములనువదలి యస్తగు శీతో
ష్ణాదుల నోర్చుకొనఁదగును.

అర్జునుఁడు— సత్తనగానేది?

కృష్ణుఁడు— ఈప్రపంచ మంతయు నేబ్రహ్మవస్తువుచేత
వ్యాపింపఁబడియున్నదో అదియేసత్తు - అదినాశ
రహితమైనది - అవ్యయంబగునట్టి బ్రహ్మమునకు
నాశముకలుగఁజేయ నెవ్వఁడును సమర్థుఁడుకాడు.
అప్రమేయుఁడు, అవినాశి. నిత్యస్వభావుఁడునగు
నాత్మకులభించిన శరీరములు నిత్యములుకావు. అ
వి యంతవంతములు. కాఁబట్టి సంసారకారణం
బగు శోకమోహాదులను త్యజించి యుద్ధముఁజే
యుము, మఱియు,

తే। గీ। చంపువానిగ నెవ్వఁడు, చంపఁబడిన
వానిగానెంచు నీయాత్మ, వాస్తవంబు
నెఱుఁగ రుభయులు, నీయాత్మ యెపుడుగాని
చంపువాఁడునుగాఁడిఁకఁ జంపఁబడదు,
పుట్టుటయులేదు లేదెప్డు గిట్టుటయును
దొలుత లేకుండి క్రొత్తఁగాఁగలుగునదియు;
నుండి పిమ్మట నెపుడు లేకుండునదియుఁ
గాదు భారత! యాయాత్మ; కానవినుము.

ఈయాత్మవస్తువు పుట్టుకలేనిదియు, శాశ్వతమైనదియుఁ బురాణమైనదిగానున్నది. దేహములుమాత్రమను ఆత్మమాటుట లేదు. ఆత్మ నెవ్వఁడు, అవినాశిగ, నవ్యయముగ, నజముగ, నిత్యవస్తువుగ నెఱుంగునో సవ్యసాచి! అట్టిపురుషుఁడెవ్వని నెట్లుచంపించును? తానుగ నెట్టు లెవ్వనిఁజంపును

అర్జునుఁడు—కృష్ణా! దేహములుపోవుటచేతమాత్రము నష్టము లేదా? దానివలన దుఃఖముకలుగదా?

కృష్ణుఁడు—అయిననేమి?

తే॥ గీ॥ తలఁపనరుఁడెట్లు జీర్ణవస్త్రములుఁవిడిచి
వేఱుగాఁ గ్రొత్తబట్టలు స్వీకరించు;
నటులె దేహియు జీర్ణ దేహములువదలి
క్రొత్తమేనులు వేఱొక్క కొనునుమఱల.

ప్రాతబట్టలు పాఱవేయునపుడు దుఃఖించువాఁడగుకలఁడా? ఆత్మయనిననో అస్త్రశస్త్రములచేత ఛేదింపఁబడఁజాలదు. అగ్నిదహింపలేదు - జలము తడుపఁజాలదు - వాయువు నెండింపనేరఁడు. ఇట్టి ఆత్మ స్థాణువు, సర్వగతుఁడు, నిత్యుఁడు, అచలుఁడు, అవ్యక్తుఁడు, అవికార్యుఁడు, అచింత్యుఁడు, మఱిసనాతనుఁడు. ఆత్మతత్త్వమెఱింగిన నీవిఁక దుఃఖింపఁదగవు.

అర్జునుఁడు—కృష్ణా! ఆత్మపూర్తిగ నాశములేనిదని యొప్పుకొనినఁగదా నీవుచెప్పుపక్షము సమంజసమగు

ను. లోకవ్యవహారంబునఁ గనఁబడునట్లు ఆత్మపై
తము చచ్చుచుఁ బుట్టుచునుండినయెడల? లేక
దేహమే ఆత్మయయినయెడల?

కృష్ణుఁడు—అప్పుడుకూడ దుఃఖింప నవశ్యములేదు. ఏల
యనఁగ?

తే. గీ. జన్మ మెత్తినవానికిఁ జావు ధ్రువము
చచ్చువానికి నిధ్రువంబు జన్మమిచటఁ;
గానఁ దప్పింప శక్యముకానిపట్లఁ
దగవు దుఃఖించుటకు నీవు ధైర్యశాలి!

వెంకియు భూతములన్నియుఁ దొలుత నవ్యక్తమున
వసించి, నడుమ వ్యక్తములగుచుఁ, బిదప నాశమునొంది
యవ్యక్తమున బొందుచున్నవి. అట్టివానికై నీకుఁ జిం
తింపనగునె! మఱియు నాత్మ నెఱుంగుట కడుదుర్లభము.

తే. గీ. చూచునొకఁ డాశ్చర్యవస్తువునుఁబోలెఁ
బలుకు వేఱొకఁ డాశ్చర్యవస్తువువలె;
నన్యుఁ డాశ్చర్యవస్తువు నట్లువినును;
వినియు నెవ్వఁడెఱుంగఁ డాత్మనునిజంబు.

అర్జునా! నీవు భీష్మద్రోణాదులను గుఱించి దుఃఖించు
చున్నావే. వారియాత్మలను గుఱించియా, లేక వారిశరీ
రములనుగుఱించియా దుఃఖించడము. ?

అర్జునుఁడు—రెంటినిగుఱించియు.

కృష్ణుఁడు—ఆత్మ నాశరహితమైనవస్తువు. కావున దుఃఖం చుట అనావశ్యకము. శరీరములెప్పుడైనను నశిం చునవి గనుక దుఃఖించి ప్రయోజనము లేదు. కాఁ బట్టి యుభయవిషయములందును దుఃఖమునకే ప్రసక్తి లేదు.

అర్జునుఁడు—కృష్ణా! నీవు చెప్పిన పరమార్థతత్త్వమును విని దుఃఖమునుబోఁగొట్టుకొనవచ్చునుగాని యుద్ధముఁ జేయవలయుననుట యెట్లు సంభవించును?

కృష్ణుఁడు—అర్జునా! నీకు యుద్ధము స్వధర్మముకదా! క్షత్రియునకు ధర్మయుద్ధమునకంటె శ్రేయస్కరంబైనది వేఱొండులేదు. అపావృతస్వర్గద్వారమైనదియు, యదృచ్ఛగాసంభవించినదియు, నగు ధర్మయుద్ధము క్షత్రియునకు నెవ్వనికి లభించునో వాఁడె ఇహపరసుఖంబులు గలవాఁడు. ఇట్టిధర్మసంగ్రామము నీవిప్పుడు చేయవేని అపకీర్తిపాలగుటయేగాక పాపముకూడనీకలుగును. నీవు పిఱికిపందవని ప్రాణులు లోకమందెల్లెడలఁ గలకాలము చెప్పుకొందురు. మానహానికంటెఁ బ్రాణహాని మేలుకదా? మఱియు నిన్ను గౌరవించుచుండిన మహారథులందఱు భయముచేత యుద్ధముచేయక

పాఱిపోయితివని చప్పట్లుకొట్టుదురు. నీకు లాఘ
వముకలుగును. దుర్యోధనాదులగు నీశత్రువులు
నీసామర్థ్యమును దూషించుచునాడరాని మాట
లాడుదురు. ఇంతకంటె వేఱేదుఃఖమేమికలదు ?

తే॥గీ॥ హతుఁడవైతేని స్వర్గంబు నందఁగలవు
జయముగల్గిన నీకె రాజ్యంబుగలుగు
రెండువిధములఁ దగు లాభముండు నీకుఁ
గనుక కృతనిశ్చయత యుద్ధమునకు లెమ్ము॥

అర్జునుఁడు — యుద్ధమునను హింసారూపము కర్మము
కదా, హింసఁగావించినఁ బాపము సంభవించు
నని భయము వేయుచున్నది.

కృష్ణుఁడు — అట్లయిన వినుము.

తే॥గీ॥ అరయ సుఖదుఃఖములను జయాపజయము
లను సమానంబులుగ నశ్రేష్ఠ లాభ నష్ట
ములఁ దలంచుచుఁ దర్వాతఁ గలను కొఱకు
మొదలుపెట్టినఁ బాపంబు బొందఁబోవు.

మఱియు,

ఉ॥ కర్మమునందెయుండు నధికారముసీకుఁ గిరీటి! యింత
యుఁగా। గర్మఫలంబునందిఁక నొకప్పుడు కల్గకయుండుఁ
గాక; యిూ। కర్మఫలాభిసంధికిని గారణమూటయుఁ

గాదు నీకు నీ। మర్మ మెఱింగి సంగమునుమాను మక ర్మమునందు నిచ్చలుఁ ।

అర్జునా ! ఫలాపేక్షను వదలి నిష్కాముఁడవై కర్మము చేయుము. దీనినే కర్మయోగమందురు. యోగమనఁగా సమత్వము. ఇట్టి నిష్కామ కర్మాచరణముచేతఁ బుణ్య పాపములు రెంటిని నీజన్మమునందె వినాశఁగలవు. అట్లు కర్మఫలంబులు త్యజించుటనియు కర్మము చేయుటయే కర్మ కౌశలమనియు దానినే యోగమనియుఁ జెప్పుదురు. జనకాదులును నిష్కామ కర్మముచేతనె సిద్ధినిఁ బడసిరి. వెండియు క్షత్రియుండవు గృహస్థుఁడవు కావునఁ లోక సంగ్రహార్థమైనను యోచించి, స్వధర్మమగు యుద్ధకర్మ మును జేసియే తీరవలయు. ఎలనన ?

తే।గీ। శ్రేష్ఠుఁడెటువంటి కర్మము చేయుచుండు
నట్టిదానినె యితరులు నాచరింతు
రతఁడు దేనిఁ బ్రమాణముంచా శ్రయించు
నట్టి దానినె లోకము ననుసరించు.

అవాప్త సమస్తకాముఁడనైన నేనుసైతము ప్రజలకు దారిచూపుటకై కర్మము చేయుచున్నాను. నేనట్లుచేయ నియెడల జనములు నన్నుఁజూచి భ్రష్టులై వర్ణసంకరము కలుగునట్లు పాడయి పోవుదురు. కాఁబట్టి కిరీటి !

తే॥గీ॥ సకలకర్మఫలంబులు సన్న్యసించి
పొసఁగ నాయందు నధ్యాత్మబుద్ధితోడ
నరసి మమకారరహితుఁడై యాసవిడిచి
తాఁకి పోరుము విగతసంతాపముసను.

ఇదియే నామతము. ఈమతము ననుసరించువారు పుణ్యపాపములనుండి విడువఁబడుదురు. ద్వేషించువారు నరకకూపంబునంబడి నశింతురు.

అర్జునుఁడు—కృష్ణా! బాత్రిగఁ గర్మము చేయునని చెప్ప
లేదుకదా; హింసాత్మకమగు యుద్ధమును వదలి
హింసారహితమగు భిక్షాటనముఁ జేసెదను.

కృష్ణుఁడు—కర్మము చేయుటయందలి ధర్మసూక్ష్మమును
జెప్పెదను లెస్సగ నాలకింపుము.

తే॥ గీ॥ చక్కఁగాఁజేయు పరధర్మసరణికంటె
విగుణమయ్యు స్వధర్మము మిగులమేలు ;
తగ స్వధర్మమునందు మేలగును మరణ
మైనఁ బరధర్మమెంతు భయావహంబు.

కావున క్షత్రియునకు లేని భిక్షాటనము సిక్కఁగాదు అర్జునా! ఈయోగమును మొట్టమొదట సూర్యునికిఁ జెప్పితిని. సూర్యుఁడు మనువుకు బోధించెను. మనువు నిక్ష్వాకునకుఁజెప్పెను. ఇట్లు పరంపరగ వచ్చిన యోగ

విద్య చిరకాలము చెల్లినందున నష్టమైపోయెను. రాజర్షు లందఱు పూర్వకాలమున నాచరించుచుండిన యీయోగమును భక్తుఁడవు సఖుఁడవునగు నీకు నిప్పుడు బోధించితిని.

అర్జునుఁడు—(లోపల తిన్నగ నవ్వుకొని) కృష్ణా! నీవు మొన్న మొన్న పుట్టినవాఁడవు. సూర్యుఁడో చిరకాలమునకుముందె జన్మించినవాఁడు; నీవుసూర్యునికినుపదేశించితివనిచెప్పుమాట నేనెట్లునమ్ముదును?

కృష్ణుఁడు—తే॥గీ॥ నాకు నీకును బెక్కు జన్మములు గడచె
వానినన్నిటి నెఱుఁగుదు నేనులెస్స;
నీవు కించిజ్ఞుఁడవు కాన నీదు పుట్టు
కలను సుంతయు నర్జున! తెలియలేవు.

సర్వభూతములకు నీశ్వరుఁడనైన నేను నాదు ప్రకృతి నధిష్ఠించి ఆత్మమాయచే భూమియందు నవతరించుచున్నాను.

తే॥గీ॥ ధరణి నెపుడెప్పు నాశము ధర్మమునకు
వెస నధర్మమునకు నభివృద్ధి కలుగు
చున్నదప్పుడు భారత! నన్ను నేను
వెలఁగి సృష్టించుకొందును స్వేచ్ఛచేత.
సాధుజనములయొక్క రక్షణముకొఱకు

సరగ బాపాత్ములకు వినాశనముకొఱకు
ధర్మ సంస్థాపనార్థము ధరణి నేను
అవతరించెద బ్రతియుగ సుందరుఁడవై.

ఇట్టినా దివ్యమైన జన్మయథార్థంబు తెలిసికొనినవాఁడు పునర్జన్మరహితుఁడై మద్భావమును పొందుచున్నాఁడు.

అర్జునుఁడు— లోకమందనేకదేశములు గలవు. వివిధ
మతముల వారున్నారు వారందఱు దేవతాంత
రముల భజించుచున్నారు. వారిగతియేమి ?

కృష్ణుఁడు— తే॥గీ॥ ఎవ్వరెవ్విధి నన్నుపాసించుచుంద్రు
వారినాలాగె నేను తప్పక ననుగ్ర
హించుచున్నాను మానవులెల్లభంగి
ననుసరింతురు నామార్గమును కిరీటి !

తే॥గీ॥ భూరియజ్ఞతపస్సులభోక్తగాను
సర్వలోకములకు మహేశ్వరునిగాను
ఎల్లభూతములకును సుహృదునిగాను
దెలిసికొనినన్నుబొందు శాంతినిబుధుండు.

అర్జునా ! ఈశ్వరుండగు నాయుపదేశమును విశ్వసించి ఫలాపేక్షారహితుఁడవై నిష్కామకర్మాచరణనిరతుఁడవై క్షత్రియులకు స్వధర్మంబగు సద్ధర్మయుద్ధమునుసలుపుము. కీర్తిని సంపాదింపుము. గాండీవము నెత్తుము.

(నిష్క్రమించిరి).

## తృతీయ రంగము.

## రాజగృహము.

ప్రవేశము-సంజయుఁడు ధృతరాష్ట్రుఁడు కూర్చుండియున్నారు

ధృతరాష్ట్రుఁడు—సంజయా! ఏట్లు యుద్ధము చేయనని మొండిపడిన యర్జునునికి ఆత్మతత్త్వము నుపదేశించి క్షత్రియ ధర్మమున యుద్ధమును జేయుమని పురికొల్పినాఁడు. సరే. ఆత్మ సాక్షాత్కారముఁ బొంది మోక్షమును బొందుటకు శ్రేష్ఠమగు జ్ఞాన మార్గముండఁగా, ఘోర కర్మమగు యుద్ధము నే జేయుమని బోధించుటకు కృష్ణుఁడేమి సమాధానము చెప్పెను!

సంజయుఁడు—రాజేంద్రా! వినుము. కర్మము చేయక పోవుటచేతనే నైష్కర్మ్య సిద్ధియగు జ్ఞానము లభింపనేరదు. మఱియుఁ గర్మము చేయక క్షణము నైనను ప్రాణుల కూరకుండుట సాధ్యపడదు. ప్రకృతి గుణముల చేతఁ బ్రేరేపింపఁబడి యస్వతంత్రులై యెదియో యొక కర్మముఁ జేయుచునే యుందురు. మొట్టమొదట బొత్తిగఁ గర్మము చేయనివానికి శరీరయాత్రకూడ జరుగదు ఇది సృష్టి రహస్యము కాఁబట్టి.

తే॥గీ॥ కడు యదృచ్ఛగ లాభము గలుగ దృప్తి
పడి విమత్సరుడగుచు ద్వంద్వములదాటి
సిద్ధ్య సిద్ధుల సమబుద్ధి జెలగు నతడు
కర్మచేసియు బంధము గలుగబోడు
జ్ఞానశూన్యులు సాంఖ్యయోగములు భిన్న
పథములందురు, పండితుల్ పలుకరట్లు!
ఎవడు రెండింట నగ నమష్ఠించు నొకటి
నుభయ ఫలమును బడయుచునుండు నతడు.

ఇట్లు అనివార్యముగ జేయవలసిన కర్మములన్నియు నీశ్వరార్పణమొనర్చి, తమకు కర్తృత్వము లేదని నిశ్చయించి ఫలాపేక్షలేక స్వధర్మానుష్ఠాన నిరతులై చరించిన యెడల చిత్తశుద్ధికలిగి జ్ఞానోత్పత్తిద్వారా పరమ పురుషార్థమును బడయగలరు.

ధృతరాష్ట్రుడు—జ్ఞానులనగా నెట్టివారని కృష్ణుని యభిప్రాయము.

సంజయుడు—చెప్పెద నాలకింపుము.

సీ॥ నిజమనోగతకామ నిచయంబు త్యజియించి
యాత్మ సంతోషంబు ననుభవించు
వీతభయ క్రోధ వినులుడై సుఖదుఃఖ
ముల నిస్పృహుండగు గలతలేక

కడు శుభాశుభములు గల్గినయెడ సంత
సము ద్వేషమును లేక సమతనుండు
సర్వేంద్రియములు వశ్యములౌచు స్వాధీన
మనను నిర్విషయసమాధినుండు.

తే|గీ| వెలయఁ దాఁబేలు తనయంగములను లోన
ముడుచుకొనుభంగి విషయసమ్ముఖమునుండి
యింద్రియంబులఁ దా సంహరించు నతఁడె
బ్రహ్మభావనచే స్థితప్రజ్ఞుఁడగును.

మఱియు,

తే|గీ| వినయ విద్యాపరీణుఁడౌ విప్రునందు
గోవునందును గజమందుఁ గుక్కయందు
మఱియుఁ జండాలునందు సమత్వబుద్ధిఁ
జూచువారలె పండితుల్ చువ్వ జగతి.

ఇట్టి జ్ఞాని వేలకొలఁది మనుష్యులలో నొక్కఁడు దొరకుట మిక్కిలి దుర్లభము.

కం| పలుజన్మములకుఁ బిమ్మట
దెలిపిని జగమెల్ల వాసుదేవుండను ని
ర్మలమతినుండు మహాత్ముఁడు
కలుగుట కడుదుర్లభంబు క్షత్రియవర్యా

ధృతరాష్ట్రుఁడు— ఇంద్రియములను వశపఱచుకొని మనస్సును స్వాధీనము చేసికొనుటకు నేమియుపాయముఁ దెలిపెను?

సంజయుఁడు—అభ్యాసయోగము నుపదేశించెను. మహా ప్రభూ ! దాని సావధానముగా వినుము. సంక ల్పమువలనఁ బుట్టు సమస్త కామంబులను బరిత్య జించి, యుక్తాహార విహారుఁడై బ్రహ్మచర్యవ్ర తంబు నవలంబించుచు నిర్జనప్రదేశంబున నసింప వలయును. నీచోన్నతులు లేని పరిశుద్ధమగుచోటఁ జేలాజిన కుశోత్తరంబగు హితమైన యాసనం బున స్థిరముగఁగూర్చుండి కాయశిరో గ్రీవము లను కదలకుండ సమముగ నుంచుకొనవలయును. అటుమీఁదట దిక్కులనుజూడక నాసికాగ్రమును జూచువానివలెదృష్టినిడుకొని, యుచ్ఛ్వాసనిశ్వా సంబులను నాసికాంతరమునందె సమపరిమాణం బుగలవిగ సంచరించునట్లుచేసి మనస్సును నిశ్చ లంబుగనుంచుకొనుటకుఁ బ్రయత్నింపవలయును. వాయువిహీనమైన స్థలంబున నుండుదీపకళికవలెఁ జలింపక యేకాగ్రత వహించువఱకు జిత్తవృత్తి నినిరోధింపనగును. మనస్సు మిక్కిలి ప్రమాధి యుఁ జంచలంబు నగుటవలన వైరాగ్యముచే తను అభ్యాస బలంబు చేతను విషయములను గూర్చి పఱుగిడు మనస్సును మెల్లమెల్లగఁ ద్రిప్పి యుపరతిఁ జెందునట్లు యత్నింపవలయును. అని

రిష్ణుఁడై ధైర్యముతో నభ్యాసముచేయువానికి నొకవేళ నీజన్మమునందు సిద్ధికలుగకపోయినను లోటులేదు. మంచిపనిచేయువాఁడు చెడిపోఁడను న్యాయము ననుసరించి యోగభ్రష్టుఁడు మృతి చెందినవెనుకఁ బుణ్యలోకములందుఁ బెక్కువత్స రంబులు నివసించి మఱల శుచియు నైశ్వర్యము నుగల సుకృతుని గృహంబునఁగాని లేక శ్రీమం తులగు యోగులకులమందుఁగాని జన్మించును. పిదపఁ బూర్వ జన్మమందలి యభ్యాస సంస్కా రములుగల తనబుద్ధిచేత వివశుఁడై పునరభ్యా సమునకు లాగఁబడుచుండును. ఇట్లు ఏకాగ్రతను సంపాదించిన మనస్సుతో నీశ్వరుని ధ్యానింప వలయును.

ధృతరాష్ట్రుఁడు—సంజయా! ఈశ్వరు నెట్టివానిగ నెప్పు డభ్యాసముసేయవలయును.

సంజయుఁడు—

తే॥ భక్తియుక్తుండెవఁడు యోగబలముచేత
మరణవేళను నిశ్చలమనసుతోడ
నులయుప్రాణముఁ దనదు భ్రూమధ్యమందుఁ
జక్కఁగానిల్పి సర్వజ్ఞ సకలలోక

శాసకుండు పురాణుఁ డచింత్యరూపుఁ
డణువుకంటెను గడుసూక్ష్మమైనవాఁడు
సకలజగమున కాధారమైనవాఁడు
నతులితాజ్ఞానరూపతమోంధకార
రహితుఁ డాదిత్యవర్ణుఁ బరాత్పరుండు
నయినపురుషుని జింతించు ననుసరించు
వాఁడ యాదివ్యపరమాత్మ నరసిపొందు.

ఇట్టిపురుషోత్తముఁడె అక్షరపరబ్రహ్మమనియు క్షేత్రజ్ఞుఁడనియుఁ దెలియఁబడును.

ధృతరాష్ట్రుఁడు—మరణవేళయందుఁ దప్పక యీశ్వరుని ధ్యానము సేయవలయునని చెప్పుటకుఁ గారణ మేమి ?

సంజయుఁడు—వినుము.

తే|గీ| అరయ నెవఁడెట్టిభావము నంతమందు
స్మరణచేయుచు నిజకళేబరమువిడుచు
వాఁడు తద్భావసంస్కారబలముచేతఁ
బడయు నాయాస్వరూపంబె పార్థివేంద్ర !

కాఁబట్టి పరమాత్మను బొందవలయునన్నఁ బ్రయాణకాలమందు నతని తప్పక ధ్యానింపవలయును. ఇట్టి అంతిమస్మృతి లభించుటకొఱకై యనుదినంబు నీశ్వరుని భక్తితో ధ్యానముసేయుట అత్యావశ్యకము

ధృతరాష్ట్రుడు—వేఱొకపనిలేక సదా యీశ్వరధ్యాన
ముసేయువానికి జీవనయాత్ర యెట్లుజరుగును.

సంజయుఁడు—

తే॥గీ॥ అన్యచింతలుమాని నిరంతరంబు
నన్నుపాసించి తెగక ధ్యానముననుండు
భక్తజనుల యోగక్షేమభారమెల్ల
నిర్వహించెద సత్యంబు నేనపార్థ!

అని శ్రీకృష్ణుఁడు అర్జునునకుఁ బ్రతిజ్ఞ చేసియున్నాడు.

ధృతరాష్ట్రుఁడు—కృష్ణుఁడు తన్నే యీశ్వరునిగ నుపదే
శించి ధ్యానముచేయుమన్నాడు కాఁబోలు!

సంజయుఁడు—ఆక్షేపణయేమి?

తే॥గీ॥ తల్లి, తండ్రియు, జగతికిఁదాతనేన
ధాత, కర్మఫలంబు, భర్తయును, ప్రభువు
సాక్షి, వసతియు, మిత్రుఁడు, శరణమింక
సృష్టిసంస్థితివిలయనిక్షేపమైన
యవ్యయంబగు బీజంబునగుదునేన.
అఖిలభూతగణంబు కల్పాంతమందుఁ
బ్రళయమునుజెందు నాయొక్క ప్రకృతియందు
నన్నిటిని వానిమరలఁ గల్పాదియందు
నేను సృష్టించుచున్నాను నియతముగను.

అనికూడఁ జెప్పియున్నాఁడు.

ధృతరాష్ట్రుడు——తాను చెప్పిన ప్రకృతిగుణత్రయ స్వభావ ముయెట్టిది ?

సంజయుడు——సత్వరజస్తమంబులని మూడుగుణంబులు ప్రకృతికింగలుగు. త్రిగుణాత్మకంబగు ప్రకృతికే మాయ యనియు నామాంతరము. ఈమాయ భగవంతుని స్వాధీనమునను్నది. ప్రపంచమంతయు మాయచే మోహింపబడి మాయాతీతుడగు నీశ్వరుని దెలిసికొనజాలకున్నది. దివ్యసామర్థ్యముగల నీమాయను దాటుటకు నసురస్వభావముగలవారికి సాధ్యముకాదు. భగవంతుడగు శ్రీకృష్ణుని యేకాంతభక్తిచూపి యతని శరణుజొచ్చుటయే ముఖ్యముగుతరణోపాయము.

ధృతరాష్ట్రుడు——అసురస్వభావమనగా నెట్టిది ? దాని ఫలమేమి ?

సంజయుడు——దంభము, అభిమానము, క్రోధము, దర్పము, అజ్ఞానము, ఇవియన్నియు నాసురగుణంబులు—నరకహేతువులు—మఱి మోక్షదాయకములగు దైవసంపద్గుణములను వివరించెదవినుము.

చ॥ దమమును సత్వశుద్ధియును దానము త్యాగము జ్ఞాన
యజ్ఞముల్ । శమను యభయంబహింసయు సదాప

నార్జవ మింక లజ్జయు౯ । శమము నపైశునంబు
ధృతిశౌచ మక్రోధత మార్దవంబు స । త్యము మితి
లేనిభూతదయ దైవగుణంబులటంచు బొల్చెడి౯ ।

అర్జునుడు నిట్టి దైవసంపద గలవాడగుటచేతనే భగవంతుడగు శ్రీకృష్ణుని శరణుజొచ్చినాడు.

ధృతరాష్ట్రుడు—కృష్ణుడు తన్ను ధ్యానము సేయుమని చెప్పెనుగదా. ఏ విభూతుల చేత వ్యాపించి సకలలోకములు నిండియున్నాడో, యే యే వస్తువులయందు దన్ను చింతనము చేయవలయునో, యాసంగతిని సవిస్తరముగా దెలిపియుండినయెడల నాకు నెఱింగింపుము.

సంజయుడు—మహారాజా! గాండీవియడిగిన యీప్రశ్నకే బహు సంతోషముతో భగవంతుడిట్లు తన్ను వర్ణించుకొనెను.

సీ। సర్వభూతాశయస్థప్రత్యగాత్మను
ప్రాణికోట్లకు జఠరాగ్ని నేను
వాసవుండఖిల దేవతలలోపల నింద్రి
యమ్ములలో మనస్సను నేను
రత్నాకరంబు సరస్సులలోపల
స్థావరంబుల హిమాచలము నేను

సకలవృక్షముల నశ్వత్థవృక్షంబాదు
నదులలోపలను జాహ్నవిని నేను.

తే॥గీ॥ శస్త్రపాణులలో రామచంద్రుఁడేను
అసురవంశజులందుఁ బ్రహ్లాదుఁడేను
పంచపాండవులందును పార్థుఁడేను
స్త్రీలకీర్తియు వాక్కును శ్రీయునేన.

భగవంతుని విభూతు లనంతములుకావున విస్తరించి చెప్ప ననావశ్యకము. ఒక్కటి జ్ఞాపకముంచుకొనుము.

తే॥గీ॥ ఊర్జితంబుగ నైశ్వర్యయుక్తముగను
జాలశ్రీమంతముగనొప్పు సకలవస్తు
చయము నీశ్వరు తేజోంశ సంభవములు;
అఖిలజగముండు నీశునేకాంశమునన.

ధృతరాష్ట్రుఁడు—సంజయా! నీవు మహా పుణ్యాత్ముఁడవు. వ్యాసులవరప్రసాదముచేత దూరశ్రవణము దూరదృష్టియుఁగలిగి కృష్ణునివిభూతిమాహాత్మ్యము నేరుగ వినఁగలిగితివి. యుద్ధరంగమున జరుగు విశేషములన్నియుఁ గట్టెదుటఁ గనఁబడునట్లు గ్రుడ్డివాఁడనగు నాకుఁజెప్పుచున్నావు.

సంజయుఁడు—మహారాజా! కొంతనిదానించుము. ఏమి ఆఅద్భుతమైన తేజస్సు! ఓహో! భగవంతుఁడు

తనవిశ్వరూపమును జూపుచున్నాఁడు. ఏమిరూ
పము! ఏమివిగ్రహము! ఏమిప్రకాశము!

సీ॥ ప్రజ్వలితాభీలబహువక్త్రములవాఁడు
తరళసహస్రనేత్రములవాఁడు
స్ఫురదనేకప్రభా భూషణంబులవాఁడు
పరమగంధానులేపనమువాఁడు
దివ్యమాల్యాంబరాధిక గాత్రములవాఁడు
అమితోద్యతాస్త్రశస్త్రములవాఁడు
విశ్వతోముఖఘోరనిశ్వాసములవాఁడు
ప్రథితాద్భుతైకదర్శనమువాఁడు.

తే॥గీ॥ ఆకసంబున సూర్యసహస్రకాంతు
లేకకాలమునం దుద్భవించునెడల
నదియె సాదృశ్యమువహించు నమ్మహాత్ము
భాసురంబగు తేజోవికాసమునకు.

(తెరజాఱును).

చతుర్థ రంగము.

సంగ్రామ ప్రదేశము,

ప్రవేశము—అర్జునుఁడు—కృష్ణుని విశ్వరూపము.

**అర్జునుఁడు**—(కేలు మోడ్చికొని)

**తే॥ గీ॥** దేవతలనెల్ల దేవ! నీదేహమందు
నీరుఁగమలాసనస్థువాణీశుఋషుల
సంఘములఁ జూచెద; విచిత్రసర్పములను
సకలభూతవిశేషసంచయమునటులె;
పెక్కుబాహువు లుదరముల్ పెక్కువక్త్ర
నయనముల్ గల్గు సర్వతోనంతరూపు
జూచుచున్నాను విశ్వేశ! చూచినీదు
ఆదిమధ్యాంతములు చూడలేదొకింత;
పరము శార్ఙ్గగదాచక్రధరుఁగిరీటి
సర్వతోదీప్తిమంతుఁ దేజస్సమూహు
నప్రమేయుని దీప్తానలార్కకాంతిఁ
జూచుచున్నాను దుర్నిరీక్షుఁడవునిన్ను;
స్వానుభవవేద్యుఁడవు పరమాత్మవనియు,
నిఖిలవిశ్వమునకు నిధానమనియు,
శాశ్వతంబగు ధర్మరక్షకుఁడవనియు,
నాశరహితుఁడవనియు, సనాతనుఁడవు,

పరమపురుషుఁడవనం చభిప్రాయపడెదన.

ఆదిమధ్యాంతరహితు ననంతవీర్యు
నపరిమితబాహు, దీప్తహుతాశవక్త్రు
నిన్నుఁగనుఁగొంటి శశిసూర్యనేత్రు;
జగము తపియించు నీదు తేజస్సుచేత.
సర్వదిశ లొక్కఁడవె యాకసంబు భూమి
యంతరిక్షము నీచేత వ్యాప్తమయ్యె;
అద్భుతంబును నీదు భయంకరంబు
నయినరూపము లోకత్రయంబు చూచి
వ్యధితమయ్యెను మిగుల మహాత్మ! యిపుడు.

ఇచటి సురసంఘములు ప్రవేశించి నిన్ను
దడిసి ప్రార్థింత్రు కొంద ఱంజలియొనర్చి;
స్వస్తిపల్కుచు సిద్ధమహర్షిగణము
పుష్కలస్తోత్రముల నిన్నుఁ బొగడఁగంటి.
రుద్రు లాదిత్యసాధ్యమరుత్తు లాశ్వి
నులును, విశ్వేశ్వనీవసువులును మఱియు
యక్షగంధర్వసిద్ధాసురాళి నిన్నుఁ
జూచుచున్నార లంతయుఁ జోద్యమొంది.
పెక్కు మొగములు కన్నులు పెక్కుతొడలు,
పెక్కు కడుపులు చేతులు పెక్కుకాళ్లు,
పెక్కు కోఱలచేతను వెఱపుఁగొల్పు

గొప్పరూపమునదె కనుఁగొనుచుఁ జనులు
వడఁకుచున్నారు; నాకట్లె వణకనయ్యె.
పెక్కురంగుల మిన్నంటినిక్కువాని
వెడదకన్నులమెఱుఁగుతో వెలుఁగువానిఁ
దెఱచికొనియున్న నోళ్లచే వఱలువాని
నిన్నుఁ గనుఁగొని భయఁపడియున్న నేను
పొంద కున్నానుగద ధైర్యమును శమంబు.
అమితదంష్ట్రాకరాళ కాలాగ్ని సదృశ
ముఖములను జూచి నాకింతసుఖము లేదు
దిక్కులును దోఁచకున్నవి దేవదేవ!
కరుణఁ బ్రసన్నుఁడవగుము జగన్నివాస!
« భీష్ముఁ డిద్రోణకర్ణులు భీమబలులు »
ధార్తరాష్ట్రులు తన్నృపతితతులతోఁడ
యోధముఖ్యులు మాప్రక్కనున్నవార
లందఱతిశీఘ్రముగ భళి! యదె త్వదీయ
భీకరాకారనిశితదంష్ట్రాకరాళ
వక్త్రములఁ జొచ్చుచున్నారు; పంట్లసందు
లందుఁజిక్కినవారలు కొందఱదిగొ
చూర్ణితశిరస్కు లగుపడు చున్నవారు;
అన్నిదెసల నదీప్రవాహంబు లెట్లు
వడి సముద్రాభిముఖముగఁ బాఱుచుండు

నిఖిలరాజన్యు లట్టులె నీదుజ్వలిత
వక్త్రములఁజొచ్చుచున్నారు త్వరితగతిని;
మండుచున్నట్టినిప్పుల మడియుకొఱకు
మిగుల వడిగొని పడుచుండు మిడుతలట్లు
రాజు లందఱు నీదువక్త్రములువడిగఁ
జొచ్చుచున్నారదిగొ చేటుచొప్పడంగ.
నించి తేజాలచేతఁ బ్రపంచమంత
రగులుమొగములతో సమగ్రముగ దెసఁగ
జవ్వులుగొని మెక్కుచున్నావు; జనులనెల్ల
కాల్చుచున్నవి భవదుగ్రకాంతులెంతొ
ఎవ్వఁడవు భీకరాకృతి నెసఁగునీవు?
తండ్రి మీాశ్వర! నీప్రసాదంబుకొఱకు;
మొదటిదైనము నినుగూర్చి పూర్తియొఱుఁగ
వలఁతు నీదుప్రవృత్తిని దెలియలేను."

విశ్వరూపముదాల్చిన కృష్ణుఁడు—

తే। గీ। "కాలుఁడను లోకసంక్షయకారకుఁడను,
ప్రజలహింసింపఁ జెలఁగుప్రవర్తకుఁడను,
జంపకున్నను నీ వరిసైన్యయోధ
వర్యు లెవ్వరునిఁక మీాఁదఁ బ్రతుకఁబోరు.
కనుక లెమ్మిఁకఁ బడయుము ఘనయశమ్ము

శత్రుజయము సమృద్ధరాజ్యంబుఁ గొనుము;
పరులు నాచేత నే చంపఁబడిరి మును పె
సమరమందు నిమిత్తమాత్రము గనుము.
ద్రోణభీష్ములను జయద్రథుం బునట్లె
కర్ణుఁ డన్యులు యోధాగ్రగణ్యులెల్ల
హతులు నాచేత వీరలు నాహవమున
వ్యసనపడకుండ చంపి జయంబుఁ గొనుము".

అర్జునుఁడు—(భయముతో వణకుచు గద్గదస్వరంబున).

తే|| గీ|| ఈశ్వర! పురాణ పురుషుఁడ వీప్రపంచ
మునకు ముఖ్యనిధానమై పొసఁగు దేవ!
ఇట్టి నీదు మాహాత్మ్యము నెఱుఁగ లేక
సఖుఁడవని యెంచి మిగుల నజ్ఞానమునను
చనువు చేతను నిన్నలక్ష్యముగ మున్ను
ఓయి మాధవ! ఓ కృష్ణ! ఓరిసఖుఁడ!
యంచుఁ బిలచితి నచ్యుతా! మించి నేను.
మొగి విహారశయ్యాసన భోజనములు,
నొంటరిగ నున్న మఱి పెద్దలున్న నెదుటఁ
గేలికై భంగపఱచితిఁ గృష్ణ! యట్టి
తప్పులన్నియు మన్నింపఁ దగ్గనిన్ను
నప్రమేయుని ప్రార్థింతు నతులభక్తి.
తండ్రి నీవు చరాచరాత్మకజగంబు

సకు, గురువంతవు, పూజ్యుండవు వికసముందు
నన్యుఁ డెవ్వఁడు లోకత్రయమున లేఁడు;
అధికుఁడైన నెట్లు నీకంటెఁ గనుఁగొందు ?
ముఁ లంబరమిసు నప్రతిమప్రభావ
నీకు సాష్టాంగము నమస్కరించి నిన్ను
వేఁడుచున్నాను క్షమియింప విశ్వరూప !
సఖుఁడు చెలికాని తప్పును సతిని ప్రియుఁడు
తండ్రి మన్నించు బుత్రుని తప్పు వోలె,
నన్ను క్షమియింపఁ దగుదు జగన్నివాస!

ఇదివఱకుఁ జూడని యీరూపమును జూచి నామనస్సు మిక్కిలి దిగులుచెందియున్నది. అనుగ్రహముచేసి లొంటి సౌమ్యరూపమును జూపుము జగదీశ్వరా! గదయుఁ జక్రకిరీటములు దాల్చి పీతాంబరధారివైన స్వరూపముఁ గైకొనుము.

కృష్ణుఁడు—అర్జునా! తేజోమయమగు నా విశ్వరూపము నిదివఱకు నెవ్వరికిఁ జూపియుండ లేదు. మాంసచక్షువులచేతఁ జూడశక్యముగానందున నీకు దివ్యనేత్రములొసంగితిని. వేదాధ్యయనమున నేమి,

యజ్ఞములనేమి, దానధర్మములనేమి, విహితకర్మములనేమి వీనిచేతనంతయు నీరూపముఁజూడ నసాధ్యంబు. దేవతలకు సైతము దుర్లభము. అనన్యభక్తిచేత మాత్రమే దర్శించుటకు వీలుపడును. ఇట్టిరూపము గనుఁగొని భయపడనలదు. నాపూర్వరూపము తిరుగఁజూడుము.

(తెలియజాలును).

---

ఐదవ రంగము.

రణరంగము.

ప్రవేశము - అర్జునుఁడు - కృష్ణుఁడు.

అర్జునుఁడు—కృష్ణా! సౌమ్యమగు నీమనుష్యరూపమును జూచి యిప్పుడు స్వస్థచిత్తుండనైతిని. ప్రజ్ఞవచ్చినది. నీయనుగ్రహమును సంపాదించువాఁడెట్లుండ వలయును?

కృష్ణుఁడు—అర్జునా! వినుము.

సీ॥ ఎవనిచేత లోకంబు తాను లోకముచేత
భీతిఁజెందనివాఁడె ప్రియుఁడు నాకు
సకలభూతముల ద్వేషములేక కరుణమై
త్రియుఁ బ్రీతికలవాఁడె ప్రియుఁడు నాకు
సుఖదుఃఖములయందు స్తుతికి నిందకు నను
ద్వేగిగానునువాఁడె ప్రియుఁడు నాకు
శత్రుమిత్రములలో శీతోష్ణకాంచనముల
భేదమూననివాఁడె ప్రియుఁడు నాకు

తే॥ గీ॥ అచలచిత్తము సంతుష్టి శుచియుఁగల్గి
పతిపానములేని పాపంబులేని
కామ్యకర్మఫలత్యాగి ఘనవిరాగి
విమలభక్తుఁడె మిక్కిలి ప్రియుఁడు నాకు.

మఱియు—

తే॥ గీ॥ సర్వభూతములందును సముఁడ నేను
ప్రియుఁడనుట లేదునాకు నప్రియుఁడు లేఁడు
భజన చేయుదు రెవ్వరు భక్తినన్ను
వారునాయందు, నేనుండువారియందు.

నాభక్తునియందు నింకొక విశేషమేమియనిన?

తే॥ గీ॥ తన్నుఁజూచును సర్వభూతస్థునిగను
బొసఁగఁదనయందుఁ గను నెల్లభూతములను;
జూచుమఱియు సమస్తవస్తువులనన్ను
సర్వమునుజూచునాయందుఁ జక్కఁగాను
ప్రాణులందఱియందును బార్థ! యతఁడు
ఆత్మసాదృశ్యమున సమానానుభవముఁ
జూచుసుఖదుఃఖములయందుఁ జెవ్వెయట్టి
వానికెప్పుడు నేఁగనఁబడకపోను
వాఁడు నాకెప్పుడును గనఁబడకపోఁడు.

సన్మార్గప్రవర్తనగల భక్తాగ్రేసరుండు వెండియు నమితశ్రద్ధతో నొసంగు నుపాయనములు ఒకపత్రమైనను, ఒకపుష్పమైనను, ఒక్కఫలమైనను లేక రవంతనీరైననుసరే ప్రియముతో స్వీకరించెదను.

అర్జునుఁడు—ఒక్క సందేహము. త్యాగమునకును సన్న్యాసమునకును గలభేద మేమి!

కృష్ణుఁడు—కామ్యకర్మములను బరిత్యజించుట సన్న్యాసమనియు, నిత్యనైమిత్తికాది కర్మఫలంబులను విడచుట త్యాగమనియుఁ బండితులు చెప్పుదురు. యజ్ఞదానతపస్సులు బుద్ధిమంతులను బవిత్రము చేయుఁగావున నేకాలమందును వానిని వదలఁగూడదు. అట్టికర్మములను ఫలాసక్తిలేక చేయవలయుననుటయే నానిశ్చయమైనమతము. కాయక్లేశభయంబువలనఁ గర్మములను వదలుట రాజసత్యాగమగును. త్యాగఫలంబు కలుగనేరదు. దేహాత్మాభిమానము గలవారికిఁబూర్తిగఁ గర్మములను విడుచుటకు సాధ్యంబుగాదు. కాబట్టి అహంకారమమకారములనువదలి ఫలాపేక్షలేక యీశ్వరార్పణబుద్ధితోఁ జేయవలసిన కర్మములన్నియు జక్కఁగఁ జేయవలయును. అర్జునా! మఱియు వినుము. నీవుక్షత్రియుండవు. తేజస్సు, శౌర్యము, ధైర్యము, సందర్భానుసారమగు సవ్యాపారప్రవృత్తి, యుద్ధమునందుఁ బాఱిపోకుండుటయు, దానము, ఈశ్వరభావము ఇవియన్నియు క్షత్రియునకు స్వభావమువలనఁ గలిగిన గుణ

ములు. ఇట్టిస్వభావనియుతమైన కర్మములను జే యుటచేతఁ బాపముకలుగదు. చక్కఁగ నిర్వర్తింపఁబడిన పరధర్మమునకంటె గుణహీనమైన స్వధర్మప్రవర్తనంబే మిక్కిలి శ్రేయస్కరంబు. కాఁబట్టి అహంకారము, దర్పము, కామము, క్రోధము మొదలి నాయందు మనస్సునుంచి సర్వకర్మములను జేయుచున్నను నాప్రసాదమునఁ శాశ్వతమైన పరమపదమును బొందఁగలవు. అహంకారముచే నామాట వినకున్నఁ జెడిపోదువు. ఇది నిశ్చయము. నీకొకవేళ యుద్ధముఁ జేయఁగూడదని మూర్ఖత్వము కలిగియున్నయెడల నీప్రతిజ్ఞ నిష్ఫలమగునని తలంచెదవా? మిథ్యయేయగును. ఏలనన, నీస్వభావగుణములచేతనే బద్ధుఁడవై మోహముచేఁ జేయనొల్లని కర్మమును నీవే చేయఁబోయెదవు.

చ॥ అరయఁగ జీవకోట్ల హృదయంబుల నీశ్వరుఁడుండి యంత్రవుఁ బురుషులచాడ్పునఁ సకలభూతములన్ గుమాయచేతనే। గిరగిరఁద్రిప్పుఁ; బ్రాణులునుఁ గ్రిందిస్వభావజపూర్వవాసనా। భరమునఁ గర్మముల్ సలుపు బద్ధులునై చరియింతురెప్పుడున్ ॥

కావున నన్నిప్రకారముల నీశ్వరునే శరణుఁబొందుము. అర్జునా! రహస్యములలోఁ బరమరహస్యమైన జ్ఞానమును నీకుబోధించితిని. దానినిలెస్సగ విమర్శించి నీకిష్టమువచ్చినట్లు నడుచుకొనుము. నాకు నీవు ఇష్టుఁడవుగనుక నింకొక మిక్కిలి రహస్యమైన సంగతి దెలిపెదను.

కం॥ నాయందె చిత్తముంచుము
నాయందే భక్తిసలిపి నతులొనరింపఁ
నాయందే కలిసికొందువు
తియ ప్రియుఁడౌట నాప్రతిజ్ఞనువినుమా॥

తే॥ గీ॥ సర్వధర్మములిపుడు లెస్సఁగనువదలి
శరణమని మ్రొక్కు మొకనన్నె చాలనిన్ను
త్వరగవిడిపింతు సకలపాపములనుండి
వగవకుము దుఃఖమంత నిఁక పాండుపుత్ర!

ధనంజయా! ఇప్పుడు నాచేతను ఉపదేశింపఁబడిన శాస్త్రమంతయు శ్రద్ధతో వింటివి కదా. ఇంతకుమునుపు నీకుండిన అజ్ఞానమోహమంతయు నశించెనా చెప్పుము.

అర్జునుఁడు—కృష్ణా! నీయనుగ్రహమువలన మోహమంతయు నష్టమాయెను స్మృతియుఁగలిగెను. సం

విషయములన్నియుఁ దొలఁగెను. నిశ్చయముగ నీవుచెప్పినట్లు యుద్ధము చేసెదను.

(అని గాండీవమును గ్రహించుచున్నాఁడు.)

నిష్క్రమించిరి

భరతవాక్యము.

తే॥ గీ॥ ఎచట యోగీశ్వరుఁడు కృష్ణుఁడెసఁగు నెచటఁ
బరగుచుండు ధనుర్ధరపార్థుఁడెచట
శ్రీయు విజయ విభూతులుఁ జెలఁగు నచట
నీతి ధ్రువమని నామతి నిశ్చయంబు।

కృష్ణార్పణమస్తు.

## ఆంధ్ర భగవద్గీతను గురించిన అభిప్రాయములు.

---

1. M.R. Ry, A. Venkata Ramiah garu BA. BL

*District Judge Cuddapah*

"The book has been written in quite an intelligible and lucid style, the spirit of the original being throughout well maintained."

2. M. R. Ry, W. Swamiah garu,

*Retired Huzur Sheristadar Cuddapah.*

"Your translation is to the spirit of the original and is very excellent."

3. M.R. Ry, Manavalli Ramakrishna Kavigaru M. A. Professor,

*Government College Rajamandry.*

"The translation is most faithful and capable of bearing all the interpretations of the original. In spite of this it is written in simple and sweet style."

4 M.R.Ry, Dakshinamurtipantulu garu B A.B.L

*District Court Vakil, Vizagapatam.*

"The translation in Telugu verse claims the merit of carrying the full force of the original Text in simple and chaste Telugu language...... you left the Philosophic Technique expressions untouched thus making the book acceptable to all schools of philosophy so much so that every

school can claim this translation as the one of their own."

5. M. R. Ry, N. Kuppuswamy ayyar avl,

*Pleader, Poet & Philosopher, Tirupati.*

"The style is very simple idiomatic and flowing. It is impossible to render the Geeta into simpler and more readable Telugu. It is the best rendering of the Geeta so far as I know The translation closely follows the original."

6. మ-రా-రాజశ్రీ, ఆంధ్రవాల్మీకి బిరుదాంకితులగు వావిలికొలను సుబ్బారావుకవిగారు ఒంటిమిట్ట కడపజిల్లా

"రచన సుబోధముగను, శైలి ధారాళముగనుం డగని సంతసించితి."

7. మ-రా-రాజశ్రీ, దర్భా. సుబ్రహ్మణ్య శర్మగారు.

ఆంధ్రపండితులు, నెల్లూరు

"ఆంధ్రీకరణము మూలానుసారియై, రచన ధారాశుద్ధిగలిగి యనర్గళమై వెలయుచున్నది"

8. మ-రా-రాజశ్రీ, శ్రీవిక్రమదేవవర్మగారు,

విశాఖపట్టణం

"ఆంధ్రభగవద్గీతను జదివి సంతోషమును బొందితిని.

అది మృదుపదయుత గీతపద్యములతో నతీ సులభశైలి నొప్పు నవికలానువాదము."

9. మ-రా-రాజశ్రీ, కవిరత్న చెమికల చెన్నారెడ్డిగారు. పర్లపాడు.

"ఈకృతిప్రాస నిర్బంధములేని గీతమాలికచేత నాంధ్రీకరణ మగుటవలన మూలమున లేని యితరపదముల సమ్మర్దములేక విస్పష్టముగనున్నది. సాధ్యమగునంతవ ఱకు మూలమందలి పదములు చేర్చను అవి యిముడనిచో టుల మూలపదములకు సరియైన యర్థపదములచేతను గూర్పబడి తృప్తికరముగ నర్థమిచ్చుచున్నది. కవులకు సమ్మతముగ లక్షణయుక్తమై యున్నది."

10. మ-రా-రాజశ్రీ, అనఘానం కృష్ణమునిగారు, కవిరత్న బాలకవి, కసిరెడ్డివెంకటసుబ్బారెడ్డిగారు, ప్రొద్దుటూరు

"భాషాంతరీకరణము పతిని బతివ్రతవలె సంస్త వనీయముగ మూలమునను సరించి నడిచినది; మఱియు గోపాలదేవుడు పవిత్రధేనువులను బిదికినపాల నొకపా త్రలోనుండి మఱియొక పాత్రలోనికి దిరుగబోసినంత కంటె గీతాంధ్రీకృతియందు మీరాయాసపడి యుండ లేదని మీసార్వత్రిక గీతపద్య ధారాసారళ్యము వ్యక్త పరచుచున్నది. శాస్త్రవిషయమైనందున వేమన పద్య

